# శ్రీ పాండురంగశతకము

రచన :

**పింగళి పాండురంగరావు**

ప్రచురణ :

**సాహితీ మంజరి**

**ఒంగోలు -523 002**

శ్రీ పాండురంగశతకము

ప్రథమ ముద్రణ :
నవంబరు 1998

వెల : రు. 15/-

ముద్రణ :
విజయ ఆఫ్‌సెట్ ప్రింటర్స్
ట్రంకురోడ్, ఒంగోలు.

ప్రతులకు :
శ్రీమతి రావినూతల మాధవీలత
"శుభప్రద"
8-71(2), లాయరు పేట
ఒంగోలు - 523 002.

హక్కులు :
రచయితవి

# ఆముఖము

ఆంధ్ర సాహిత్య చరిత్రలో ద్విపద, యక్షగానం, శతకము, నవల, నాటకము, గేయము మున్నగునవి వివిధ ప్రక్రియలు. ప్రాచీనకాలంలో సంస్కృత శతకాలు వ్రాయబడ్డాయి. అందులో మయూరిని "సూర్యశతకము", బాణుని "చండీ శతకము", "ఆర్యాసప్తశతి", "లక్ష్మీ సహస్రమ్" ప్రసిద్ధమైనవి. తెలుగులో 12వ శతాబ్దం నుండి శతక రచన ఆరంభమయింది. 'ప్రబంధ రచనలతో పాటు సమాంతరంగా శతక రచన కూడా అభివృద్ధి చెందింది. పాల్కురికి సోమనమొదలు ఈనాటి ఈ పాండురంగరావు వరకు వేలాది శతకాలు వెలుగు చూశాయి. శతకములన్నీ కూడ భక్తి, నీతి, శృంగార, ధర్మ బోధన, సామాజికమైన విషయాలపై వ్రాయబడ్డవే. కాని భక్తి ప్రధానమైన శతకములే ఎక్కువ. శతక వాఙ్మయం విద్వత్‌లోకంలో కంటే పామరజన బాహుళ్యంలో ప్రయోజనకారిగ నిలిచినందనడానికి వేమన శతకమే నిదర్శనం. సుమతి, కృష్ణ, భాస్కర, దాశరధి శతకాలు చదువని ఆంధ్ర విద్యార్థులుండరనుట అతిశయోక్తికాదు.

నీతి పరమైన శతకాల్లో కెల్ల వేమన పద్యరత్నాలకే అగ్రస్థానం. అతిమధురమైన ఆట వెలదులు ఆంధ్ర సరస్వతిని శోభిస్తున్న అమూల్య రత్నాభరణాలు. తేట తెనుగు తియ్యని పద్యాల్ని వేమన తెనుగు నాట పరిచాడు. వేనవేల వేమన పద్యాలు జనసామాన్యంలో జీవం పోసుకున్నాయి. వేమన మహా ప్రగతి శీలుడుగానూ, గొప్ప మానవతావాదిగాను మనకు దర్శన మిస్తాడు. వేమన గొప్ప సంస్కారవాది. కనుకనే ఆయన తిరుగులేని ప్రజా కవిగా నిలిచిపోయాడు.

బహుముఖ శేముషీ సంపన్నుడైన వేమన్న విశిష్టకవిత్వ రచనా సౌందర్యం నన్ను ఆకట్టుకుంది. వేమన్న పద్యరచనా పరిమళాలు తెలుగు రసిక జనావళిని నిరంతరం రంజింపచేస్తూనే వుంటాయి. పద్యప్రాశస్త్యాన్ని గురించి చెప్తూ - వేమన అంటాడు.

"నిక్కమైన మంచి నీలమొక్కటిచాలు
తళుకు బెళుకు రాలు తట్టెడేల?
చదువ పద్యమరయజాలదా యొక్కటి."

ఈ స్ఫూర్తితోనే నేను ఒక శతకము వ్రాయాలని అనుకున్నాను. భగవదనుగ్రహంవల్ల, అనుకోని రీతిలో, అనతికాలంలోనే ఈ శతకాన్ని వ్రాయగలిగాను. ఈ ప్రయత్నంలో నాకు అన్ని విధాల సహాయకారాలనందించిన ఆబాల్య మిత్రులు డా॥ నాగభైరవ కోటేశ్వరరావుగారికి హార్దిక కృతజ్ఞతలు. పాఠక సహృదయులకు ఏపాటి తృప్తినిచ్చినా నేను ధన్యుణ్ణిగా భావిస్తాను.

ఈ శతకము సాహితీమంజరి పదకొండవ ప్రచురణ గావడం హర్షదాయకం.

శ్రీమతి రావినూతల మాధవీలత
అధ్యక్షులు
సాహితీమంజరి, ఒంగోలు - 523 002.

పింగళి పాండురంగరావు
శతక రచయిత మరియు కార్య నిర్వాహకాధ్యక్షులు
సాహితీమంజరి.



# సాహితీ మంజరి

లాయరు పేట, ఒంగోలు -523 002

వ్యవస్థాపకులు : శ్రీమతి రావినూతల. మాధవీలత

కార్యనిర్వాహకాధ్యక్షులు : పి. పాండురంగరావు

**ప్రచురణలు :**

1. **నీరాజనం** (గేయసంపుటి)
   - పింగళి పాండురంగరావు
2. **మహాభినిష్క్రమణం** (ఇందిరాగాంధీ సంస్మరణ కవితా సంపుటి)
   కూర్పు : పింగళి పాండురంగరావు
3. **స్మృతి సుధ** (కవితా సంపుటి)
   - పింగళి పాండురంగరావు
4. **బైరాగి కవితాశోభ** (సమీక్షా వ్యాసాలు)
   సంపాదకలు : పింగళి పాండురంగరావు
5. **నిష్కృతి** (కవితలు)
   - పింగళి పాండురంగరావు
6. **శరసంధానం** (కవితలు)
   - పైడిశ్రీ
7. **గోరుముద్దలు** (బాలవిజ్ఞాన కవితలు)
   - శ్రీ రావెల సాంబశివరావు
8. **సాంధ్యవేళ** (కవితలు)
   - పింగళి పాండురంగరావు
9. **విప్లవ భాషా విధాత**
   - డా॥ శేషేంద్ర శర్మ రచనలపై సమీక్షవ్యాసాలు
10. **ప్రేమ సుధ** (కవితలు)
    - పింగళి పాండురంగరావు

# సమర్పణము



శ్రీ
పండరిపుర విభుని
పావన పాద సన్నిధికి...
ప్రణతులర్పిస్తూ...

# శ్రీ పాండురంగశతకము

## ప్రణుతిమాల

ప్రాణములను ఊది బ్రతికించి, పోషించి
ప్రియతలాలనముల ప్రీతి పెంచి
అనవరతము కాచి ఆశలు తీర్చిన
మదినికొలుతు నేను మాతపితల

పవలు రేయి నిల్చి పాపులరక్షించు
శరణటన్న చాలు జయము కూర్చు
అంతరంగమందు అవధరించిన రేడు
వెంకటేశ్వరునకు వినుతి సేతు

ఎన్నొ ప్రతిభలిచ్చి ఏలుచునున్నాడు
కుటిల జనుల మధ్య కూర్మిచూపి
నన్ను బ్రోచినాడు నాయేసు నాథుడు
ఎంతకాలమైన ఏసు గొల్తు

సృష్టి మర్మమొక్క సోదర ప్రేమయే
అనుచు జనుల కెల్ల వినిచినాడు
ఇంగితమునుచెప్పి ఇస్లాముమత బోధ
కుండు వాని కెపుడు నిండు ప్రణుతి

వెఱ్ఱి వాడటంచు వేనోళ్ళ చాటిరి
ఓగుమాట కెల్ల ఒప్పు చెప్పె
ఎన్ని మతములున్న ఏకాత్ముడొక్కడే
శరణు వేడి కొందు సాయినాథు

సాధు జీవనమున సంఘ శ్రేయము చూపి
పాపులందు కూడ చూపె ప్రేమ
అనుక్షణమ్ము తాను అందరిన్ బ్రోచెను
శుభము కూర్చు సాయి చూతుమదిని.

ఇటుకముక్కలోనె ఈశునిదర్శించె
కటిక నేలకూడ కనక మాయె
నమ్మమంచు పలికె నానావళీ మాట
సాయికొల్తు నేను సతము నిజము.

పంచభూతయుతము పరమాత్ముడొక్కడే
పాంచభౌతికమ్ము ప్రకృతి గూడ
ప్రణవరవము మించు పావన మ్మేదిరా
సకల లోకనాథు సన్ను తింతు.

వార్ధకమున నాకు వాక్పతిచెలియాయె
పలుకు పలుకులందు వెలిగె కవిత
కలము చేతికిచ్చి కవితలు పలికించె
శారదాంబనెపుడు సన్నుతింతు.

గురువుగారి కొడుకు కూర్మిమిత్రుడు నాకు
నాగభైరవుండు రాగమతియు
నన్ను రచనయందు నడిపించు దిక్కాచి
అతనికెడదయందు అంజలింతు.

తాను పుట్టి నూరు దైవాలరావూరు
ఇంటి పేరు పింగళింపు గాను
సుబ్బరావు సుతుడు సూనృతహృదయుడు
శతకరచన చేసి సంతసించె

# శ్రీ పాండురంగశతకము

శ్రీలు కలుగ జేసి శ్రేయమ్ము లోన గూర్చి
కలిమి లేములందు కరుణ జూపి
సకల జీవరాశి సాకు వాడవు నీవు
పాండురంగ వినుత భవ్య చరిత॥ 1

ఏకపత్నియందు ఎనలేని కూర్మితో
ఇహములోని జనులకింపు కూర్చి
రామరాజ్యమేలె రమ్య సృష్టిని చేసి
పాండురంగ వినుత భవ్య చరిత॥ 2

విమల కీర్తియొకటి వేవన్నెలొసగును
జ్ఞానకమల మొకటె జగతి వెలుగు
కార్యసాధకునకు కడగండ్లు తప్పవు
పాండురంగ వినుత భవ్య చరిత॥

జిహ్వ ఒకటి ఇచ్చె జేజేలు పలుకంగ
వినుతి వినగ రెండు వీనులిచ్చె
భక్తి చాటు కొరకు బ్రతుకునే ఇచ్చెను
పాండురంగ వినుత భవ్య చరిత॥ 3

పూలగంధ మందు పున్నమిరేయందు
గాలి యందు ప్రకృతి లీలయందు
అణువు అణువులోన అగుపించు పరమాత్మ
పాండురంగ వినుత భవ్య చరిత॥ 5

పరిమళమ్ములేని విరులజన్మములేల
పచ్చదనము లేని పత్రమేల
తేనె కూర్పులేని తేనెటీగేలరా
పాండురంగ వినుత భవ్య రచిత॥ 6

భూతదయను చూపు బుద్ధి యున్నను చాలు
కష్టకాలమందు కరుణ చూపు
ఒరులప్రేమ చూడ ఒనగూడు పరమెల్ల
పాండురంగ వినుత భవ్యచరిత॥ 7

కల్ల లాడు వాడు కలనైన పెరుగడు
నిజము పల్కు మనిన నిష్టురంబు
సత్యవంతు డెపుడు సాయుజ్యమును పొందు
పాండురంగ వినుత భవ్య చరిత॥ 8

సర్వ శ్రేయమన్న సర్వేశ్వరుని సేవ
సుగతి పథము నడువు సుద్దులేల
ప్రగతి బాటలోనె భవితవ్యముందిరా
పాండురంగ వినుత భవ్య చరిత॥ 9

దేశమాత కన్న దేవతలే లేరు
దొంగ ఎవడు దేశద్రోహి కన్న
తల్లిపాలు త్రాగి తల్లినే తందువా
పాండురంగ వినుత భవ్య చరిత॥ 10

గయుని కిచ్చు మాట గంగలో కలుపక
వాసుదేవునెదిరె పార్థి వుండు
మాటపోక కన్న మరణమ్ము మేలురా
పాండురంగ వినుత భవ్య చరిత॥ 11

ఎన్ని వత్సరాలు ఏవాడు బ్రతికినా
భ్రాంతి యున్న మనిషి భ్రష్టుపట్టు
రాల్చితుట్టె, తేనెగ్రహియింపవలెనురా
పాండురంగ వినుత భవ్య చరిత॥ 12

ధనము వలన రావు, దర్పాన కనరావు
ప్రతిభ తెచ్చు గొప్ప ప్రాభవములు
మాననీయులెపుడు మామూలు మనుషులే
పాండురంగ వినుత భవ్య చరిత॥ 13

కూడ బెట్ట బోకు కుటిల చేష్టలుచేసి
కలిమి కూర్చు టొకటె ఘనత కాదు
చీమ బ్రతుకు చూడు చిత్తభ్రాంతిని వీడు
పాండురంగ వినుత భవ్య చరిత ॥ 14

వాక్కువలన మనిషి వరణీయుడగుతాను
వాక్కువలన కలుగు వైభవమ్ము
వాక్కు భూషణంబు వజ్రాలగనియెరా
పాండురంగ వినుత భవ్య చరిత ॥ 15

మించు కోర్కె వచ్చి మంచినే హరియించు
కోర్కె కొండలెక్క  కొమ్ము విరుగు
కోర్కెవలన గాదె కూలె భస్మాసుర
పాండురంగ వినుత భవ్య చరిత॥ 16

కలియుగమున నరుడు కాంచనమ్మును కోరు
కనక మబ్బెనేని కాంతవలయు
దేవదేవునికైన దేవేరిదూరమా
పాండురంగ వినుత భవ్య చరిత॥ 17

ప్రజల బలిమి వలన ప్రభుతఏర్పడుగాని
ప్రజల మరచినపుడు ప్రభుత చెడును
ప్రజలు ఏకమవక ప్రగతి సిద్ధించునా
పాండురంగ వినుత భవ్య చరిత॥ 18

సూర్యరశ్మిలోని సూక్ష్మాంశములచేత
జీవరాశికెల్ల క్షేమ మగును
మనిషి వెలుగు చేత మర్మజ్ఞడవలేదె
పాండురంగ వినుత భవ్య చరిత॥ 19

మంచిమాట వలన మత్సరాల్ తొలగును
పరుష భాషణమున ప్రాప్తి నష్టి
మనసు మంచిదైన మాటలే మధురమౌ
పాండురంగ వినుత భవ్య చరిత॥ 20

కలుగు కర్మ ఫలము కలుగక మానదు
కలుగునట్టి ప్రతిది కడకురాదు
కర్మ ఫలము కర్త కరుణామయుండెగా
పాండురంగ వినుత భవ్య చరిత॥ 21

తనకు విజయమెల్ల తన శక్తి వలనంచు
ఎగిరి పడిన మనిషి ఎండు తుదకు
ఎంత ఎగురు బంతి అంతలో ఒరగదా
పాండురంగ వినుత భవ్య చరిత॥ 22

ధనమదాంధు లెల్ల దర్పమ్ము వీడక
ధరను ధర్మమెటుల తేజరిల్లు
పేద వారి కలిమి పెద్దమనసేనురా
పాండురంగ వినుత భవ్య చరిత॥ 23

మునులబోధలోని ముఖ్యార్థమొక్కటె
ధర్మమునకుగ్లాని తగదు జగతి
మనసు మరచి మనిషి మాతంగుడౌనురా
పాండురంగ వినుత భవ్య చరిత॥ 24

కాలి వ్రేళ్ళు లేవు గరికపోచలు లేవు
సరిగ అమరినట్లు జగతియందు
అస్తవ్యస్తములకు అవనియే సాక్ష్యమ్ము
పాండురంగ వినుత భవ్య చరిత॥ 25

భక్తి శుద్ధి యున్న ప్రణమిల్లు పృథ్వియు
అష్టకష్టములును అడ్డురావు
భక్తరామదాసు భవ్యుడై నిలిచెరా
పాండురంగ వినుత భవ్య చరిత॥ 26

ప్రశ్న వలన నెపుడు ప్రభవించుజిజ్ఞాస
ప్రశ్నవిలువ నరయ ప్రాజ్ఞుడువును
సత్యమరయు వాడె సదసద్వివేకిరా
పాండురంగ వినుత భవ్య చరిత॥ 27

పండితునకు కులము పనిలేదు ధరలోన
కుటిల మతము వలన కూడు కీడు
కుమ్మరైన మొల్ల కమ్మని కధనల్లె
పాండురంగ వినుత భవ్య చరిత॥ 28

వరలు కల్మి లేమి వైరుధ్య మెల్లను
ఎత్తు పల్లమున్న యిలను బోలి
వెలుగు ఛాయలందు వర్ధిల్లు విశ్వమ్ము
పాండురంగ వినుత భవ్య చరిత॥ 29

మగువ వలపు సోక మౌనులే ముగ్ధులు
సత్యభామ హరిని చాచితన్నె
పంకజాక్షులన్న ప్రణయాస్పదులుకదా!
పాండురంగ వినుత భవ్య చరిత॥ 30

అంత్యకాలమందు అగువృథా జపమాల
భోగమందు నరుని ముక్తి లేదు
వెలుగులుండినపుడె వినియోగపడవలె
పాండురంగ వినుత భవ్య చరిత॥ 31

రసికతలకు నెలవు రాయలభు వనమ్ము
చెంగలించె నచట చతుర కళలు
రసము నరయ గలుగు రాజు మారాజురా
పాండురంగ వినుత భవ్య చరిత॥ 32

అసలు నిజము వలన ఆ హరిశ్చంద్రుండు
పూర్ణ భక్తి దనుజ పుత్రుడొకడు
సత్యమునను భక్తి సర్వేశు గాంచిరి
పాండురంగ వినుత భవ్య చరిత॥ 33

ఇహములోన మంచి ఎంతచేసినచాలు
పరములోని చింత వదలవచ్చు
ఇహపరమ్ములగురి ఎన్నగా మోక్షమ్మె
పాండురంగ వినుత భవ్య చరిత॥ 34

నరుని చేష్టలెన్నొ నరమేధమైతోచు
జాలి ఎరుగనట్టి జాతి హంత
శిలువ పైన యేసు చిత్రహింసలనొందె
పాండురంగ వినుత భవ్య చరిత॥ 35

మనిషి ఒకడెపుట్టు మరణించునొక్కడే
నడుమ కురుచ బుద్ధి నరునికేల?
ఆత్మ యొకటిగాని ఆలోచనములెన్నొ
పాండురంగ వినుత భవ్య చరిత॥ 36

ఒక్కఫాలమందు ఓజస్సు ఉండును
ఒక్కపలుకులోనె ఓర్మి తెలియు
ఓర్మి కలిమి చేత ఒనగూడు సర్వమ్ము
పాండురంగ వినుత భవ్య చరిత॥ 37

అవనిలోనిదంత అస్థిరమేగదా
అక్షిచూడ లేని దాత్మ యంట
మధ్య ఊగులాట మహిలోన దేనికి?
పాండురంగ వినుత భవ్య చరిత॥ 38

ఆత్మ సంతనమున అందరు ఒక్కటె
ఆత్మకంటు ముట్టు అసలు లేదు
ఆత్మ జ్ఞానియగుట కడ్డంకులెన్నియో
పాండురంగ వినుత భవ్య చరిత॥ 39

స్వర్గ సుఖములన్ని వట్టి వోగట్టివో
కనుచు ఎవరు చెప్ప గలిగినారు
ఇచట మంచి పెంచ ఇలయౌను స్వర్గమ్ము
పాండురంగ వినుత భవ్య చరిత॥ 40

రాక ఎచటి నుండొ, పోక ఎచ్చటకొనొ
తెలిసినట్టి వారు ఇలను లేరు
మధ్య మంచి చేయు మనుజుండె ధన్యుండు
పాండురంగ వినుత భవ్య చరిత॥ 41

ఏమి చేయకుండ ఏళ్లన్ని గడుపుచు
కాలమంత ఇట్టె కరగి పోవ
మనిషి పోవనేల  మంచిని చేయక
పాండురంగ వినుత భవ్య చరిత॥ 42

మర్కటములు చెప్పె మంచి సూక్తులు మూడు
మనిషి కూడ చెప్పె మంచినుడులు
ఆచరణము లేని ఆశయాల్ వృథగదా
పాండురంగ వినుత భవ్య చరిత॥ 43

మూగభాషనిచ్చె ముగ్ధ ప్రాణులకెల్ల
పువ్వునవ్వుగాదె పూయగానె
మనసు పరవశింప మాటతో పనియేమి?
పాండురంగ వినుత భవ్య చరిత॥ 44

అమ్మ అన్న పిలుపు అమృతంపుధారరా
అమ్మ లేకయున్న అవని సున్న
అమ్మ పొట్ట మాడ్చు అధములున్నా రిట
పాండురంగ వినుత భవ్య చరిత॥ 45

భిన్న ధృవములెపుడు భృకుటీకరించవు
నేలనెట్లు తాకు నింగి వంగి
సజ్జనాళి త్రోవ సాగునా మొఱకుండు
పాండురంగ వినుత భవ్య చరిత॥ 46

అడలి నిప్పులోన అబ్బురమే లేదు
కిరణ జాలమందు కిటుకు లేదు
మంచి వారి కథలు మహనీయములుకదా
పాండురంగ వినుత భవ్య చరిత॥ 47

మనసు - మమతలున్న మాన్యతకల్గును
రెండు లేని మనిషి బండ అగును
రెంట చెడుచు నేడు రేవడులైనారు
పాండురంగ వినుత భవ్య చరిత ॥ 48

పుట్టి, పెరిగి తుదకు పూర్తిగా క్షీణించు
ఆయువన్నదాని కవధి లేదు
సత్యసుందరమ్ము సర్వేశుడొక్కడే
పాండురంగ వినుత భవ్య చరిత॥ 49

బ్రతికి చెడిన కూడ వాడదు దర్పమ్ము
చెడియు బ్రతికినపుడు చెడుగుపోదు
చాతకమ్ము చూచు చల్లని మొయిలుకై
పాండురంగ వినుత భవ్య చరిత॥ 50

మనసునందు గొప్ప మాలిన్యములు దాచి
ఆడనేల స్నాన మనవరతము
అంతరమున కలుష మన్నిట చేటురా
పాండురంగ వినుత భవ్య చరిత॥ 51

మొక్కు చుందు మోయి ముక్కోటి దేవుల
అసలు సిసలు కర్త నరయ లేక,
సకల భువన విభుడు సర్వేశుడొక్కడే
పాండురంగ వినుత భవ్య చరిత॥ 52

ఉత్తమ పథమందు ఉన్మీలనము చెందు
రాహు కాలమందు రగులు శ్రమలు
వెనుక దుఃఖ పడుట వెర్రి తనమ్మురా
పాండురంగ వినుత భవ్య చరిత॥ 53

ఒక్కతీపి పలుకు ఒడలెల్ల పులకించు
కోకిలమ్మ పిలుపు కోర్కెతీర్చు
పాడు నీటి కంటె పన్నీరు మేలురా
పాండురంగ వినుత భవ్య చరిత॥ 54

పరుల హితము ఒకటి నరజన్మ ధర్మమ్ము
పాయ లేము జన్మ బంధములను
మనిషి తెలియ లేడు మరు జన్మ ఒక్కటే
పాండురంగ వినుత భవ్య చరిత॥ 55

చలువ రాయి ఏల జారుట ఖాయము
కాముకునకు సతము కాల్చువ్యథలు
ఇసుక తిన్నె చాలు ఇసుమంత శాంతికై
పాండురంగ వినుత భవ్య చరిత॥ 56

సంపదున్న నేమి సంస్కారి కాకున్న
ప్రతిమ రూపు లేని బండ యేల
దేశ శ్రేయ మెట్లు వాసించు దుష్టుతో
పాండురంగ వినుత భవ్య చరిత॥ 57

కాలగమన మందు కాలము హరియించు
ఆకసమున దివ్వె ఆరిపోవు
ఆయువున్నవరకై ఆశల ఊసులు
పాండురంగ వినుత భవ్య చరిత॥ 58

సృష్టిలోని ప్రతిది సుఖదకారకమగు
చెడగు చేయునట్టి జీవిలేదు
మనిషి శ్రేయ మొకటె మహితాత్ము దృష్టిలో
పాండురంగ వినుత భవ్య చరిత॥ 59

గుప్పెడంత గుండె కోటి ఆశలు కోరు
ఇంద్రధనుసు ఎడద ఇంపు కూర్చు
ధర్మనిరతియొకటె దరిజేర్చు సద్గతి
పాండురంగ వినుత భవ్య చరిత॥ 60

మధుర భావజలధి మనుటయే మోదమ్ము
ఎరుగ లేదు తుదిని ఎడద పాట
నీకు తీరు కోర్కెనిక్కమ్ము ఇలలేదు
పాండురంగ వినుత భవ్య చరిత॥ 61

విషపు ప్రాణినేల విధి తాను సృజియించె
అంతరార్థ మేల అరయ లేవు
కాలకూట విషము కాచును ప్రాణమ్ము
పాండురంగ వినుత భవ్య చరిత॥ 62

కులపు భేదమెంచి గుణభేదముండునా
గుణము కలిగినేని గణుతి కెక్కు
గుణము ఒకటి చాలు కులముతో పనియేమి?
పాండురంగ వినుత భవ్య చరిత॥ 63

పుట్టినట్టి మనిషి పూర్ణుడే అనుకోకు
పుట్టు కెరిగె నెవడు పృధ్విలోన
ఆది మధ్యమందు అవధానమరయరా
పాండురంగ వినుత భవ్య చరిత॥ 64

ఓటికుండలోన ఉదకమున్నట్టు లే
పంకజమున నిలువ ఫలమదేమి
లోభివాని కెపుడు లోగుట్టు తెలియదు
పాండురంగ వినుత భవ్య చరిత॥ 65

కనుల ముందు నిలుచు కలిమియు కలిమియే
కలిమి కూర్చు కతన కలతపోదు
ఆత్మ చక్షు చాలు ఆనందమునుపొంద
పాండురంగ వినుత భవ్య చరిత॥ 66

చెలిమిలోని కలిమి శ్రీహరి చాటెను
అటుకు లారగించి అన్ని ఇచ్చె
చెలిమి లోని తీపి చెలిమికే తెలియును
పాండురంగ వినుత భవ్య చరిత॥ 67

నీవు పొందు ప్రతిది నీవల్ల కానిది
ఇచ్చు చున్న ఫలము ఇచ్చగించు
మంచి చెడుల ప్రాప్తి మహదేవు చిత్రమే
పాండురంగ వినుత భవ్యచరిత ॥ 68

కల్లు తాగు వాడు కల్లలో పొర్లాడు
మంచిని మరియాద మట్టుపెట్టు
తాగినతని మాట తక్కిడి బిక్కిడి
పాండురంగ వినుత భవ్య చరిత॥ 69

ఆత్మలోని శక్తి అణుశక్తికిని లేదు
కార్యశీలు శక్తి కరికి లేదు
ప్రజల శక్తి లోనె ప్రభుశక్తియుండురా
పాండురంగ వినుత భవ్యచరిత ॥ 70

శ్రమను మించు నట్టి సౌందర్యమే లేదు
సోమరన్న మించు శుంఠలేడు
కష్టజీవి జాతి కళ్యాణకారుడు
పాండురంగ వినుత భవ్య చరిత॥ 71

దాన ధర్మమెల్ల దయనీయకోసమే
పూజ సేయుటెల్ల ముక్తి కొరకె
ఆత్మశుద్ధియున్న అవ్యయానందమే
పాండురంగ వినుత భవ్య చరిత॥ 72

సూరదాసు గ్రుడ్డి సూర్యుని కనలేడు
జాను మిల్టనేమొ జగతి కనడు
అంధులైన నేమి ఆత్మ దృష్టియె చాలు
పాండురంగ వినుత భవ్య చరిత॥ 73

పొగరు మీసమేల మగవాడు కాకున్న
మధుర జలము లేని మడుగు యేల
పతికి ప్రేమ నీని అతివతా సతియౌనె
పాండురంగ వినుత భవ్య చరిత॥ 74

మట్టి లోన పుట్టి మట్టిలో శ్రమియించి
కబళ మింత ఇచ్చు కర్షకుండు
హాలికాళికన్న అధికులెవ్వరు లేరు
పాండురంగ వినుత భవ్య చరిత॥ 75

గాంధి పేరు చెప్పి, ఖద్దరు ధరియించి
దోచినారు జాతి త్రోవలన్ని
చిల్ల కంప తెచ్చి చెట్ల నవచ్చునా?
పాండురంగ వినుత భవ్య చరిత॥ 76

సర్వవేళ లందు సౌఖ్యాలలో తేలి
పెదవిమీద దైవపదము పలికి
ప్రభువు కృపను కోర ప్రాప్తించు నాయేమి?
పాండురంగ వినుత భవ్య చరిత॥

77

అక్షరాస్యులగుచు అందరు వర్ధిల్ల
పరిఢవిల్లు విప్లవమ్ము నాడె
పఠితకాని నాడు పరిణతి ఎటులబ్బు?
పాండురంగ వినుత భవ్య చరిత॥ 78

ధనము పేర్చువాడు ధర్మమ్ము నెరుగడు
కలిమి లోని కీడు కాంచలేడు
ధనము లేక నేమి దయయుండినను చాలు
పాండురంగ వినుత భవ్య చరిత॥ 79

ఆంజనేయు భక్తి ఆచాంద్రతారకమ్
శబరి ఎంగిలేమొ చరిత కెక్కె
నామ మదియె మిన్న రామయ్యకంటెను
పాండురంగ వినుత భవ్య చరిత॥ 80

అహము లేని వాడు ఆరాధ్యుడౌనులే
అహము కలిగె నేని అధముడగును
చిత్త శాంతి వలన స్థిర రూపుడగునురా
పాండురంగ వినుత భవ్య చరిత॥ 81

ఎండమావి భ్రమసి ఎన్నేళ్లు తిరిగినా
ఫలము నొందలేవు భ్రమను విడక
కలల జగతి చూడ కల్లగాకే మౌను
పాండురంగ వినుత భవ్య చరిత॥ 82

ధర్మ పాలనన్న ధారావ్ర తమ్మగు
నడిమి అడవితోచు నాకముగను
పాండు పుత్రులెల్ల బహుక్లేశమందిరి
పాండురంగ వినుత భవ్య చరిత॥ 83

పోతనేమొ కలను పూజించె దేవుని
అన్నమయ్య కనుల హరిని గాంచె
పూర్వ జన్మలోని పుణ్యాల ఫలమురా
పాండురంగ వినుత భవ్య చరిత॥ 84

ఒక్క బొంకు వలన ఓడలు బండ్లౌను
చెడును వాడ రంకులాడి వలన
రంకు బొంకు నడుమ రంజిలు నరుడెట్లు?
పాండురంగ వినుత భవ్య చరిత॥ 85

మానవులకు సేవ మాధవ సేవంద్రు
మనిషి మరచి నరుడు మందుడాయె
పాపభీతి వలన భగవంతుపైభక్తి
పాండురంగ వినుత భవ్య చరిత॥ 86

హిందువుండు వేరు ఇస్లాము వేరను
మాట వట్టి పిచ్చి బూటకమ్ము
మనుజులందరిచట మనభారతీయులే
పాండురంగ వినుత భవ్య చరిత॥ 87

మనసునందు మకిల మానుపగాలేక
గంగయందు మునుగ ఘనత యేమి?
మలిన వస్త్రమేల మడిచేయించుట
పాండురంగ వినుత భవ్య చరిత॥ 88

ఆర్య చరితలోన అతివలారాధ్యులు
పురుషుడధికుడంచు పృచ్ఛయేల
నరుడు నారికలువ నవ జగమ్మౌనురా
పాండురంగ వినుత భవ్య చరిత॥ 89

ఎన్ని రూపులున్న ఏకాత్ముడవునీవు
ఆది అంతమందు అవ్యయుడవె
కరుణ జూపి బ్రోచు కారుణ్యమూర్తివి
పాండురంగ వినుత భవ్య చరిత॥ 90

నయనములకుయింపు నటన నేర్చిన ఇంతి
చూడ చూడ అతివ మేడిపండు
వెలది వల్లనెవరు వెలుగొంద లేదయా
పాండురంగ వినుత భవ్య చరిత॥ 91

మనిషి పుట్టుకొకటి మహిలోన ఉత్తమమ్
మదిని నిండి యుండె మనిషి విషము
జనుడు మహిని ఎట్లు స్వర్గమ్ము చేయురా?
పాండురంగ వినుత భవ్య చరిత॥ 92

సానుభూతి చూప సద్గతి పొందును
ఎడద నీరు పొంగి ఏరు అగును
మనసు మనసు తాక మమతయే చివురించు
పాండురంగ వినుత భవ్య చరిత॥ 93

పాప భవము ధరణి భరియించగా లేదు
పాప కర్మ చేయు చూపు విడుము
పాప రహితుడెపుడు భగవాను చేరువౌ
పాండురంగ వినుత భవ్య చరిత॥ 94

ఆత్మ జ్ఞానమంద అవసరమ్మగు సిద్ధి
చిత్త శుద్ధి గలిగి చేయవలయు
బుద్ధి హీను నందె పుణ్యాత్ముడుండడా?
పాండురంగ వినుత భవ్య చరిత॥ 95

రాజకీయ మనగ రాల్చును కాసులు
చట్ట సభల కన్న శవము మేలు
ప్రజల ధనము తినని ప్రభువొకడుండునా?
పాండురంగ వినుత భవ్య చరిత॥ 96

తనకు సాయపడిన ధర్మాత్మునకు కూడ
కీడు చేయు వాడు పాడు బుద్ధి
దాటిఏరు తెప్ప తగులబెట్టినయట్లు
పాండురంగ వినుత భవ్య చరిత॥ 97

అధికతెంత యున్న అవని బూడిదపాలు
కొద్ది మంచి తనపు గుణము చాలు
చచ్చి చచ్చు కన్న చచ్చి జీవించరా
పాండురంగ వినుత భవ్య చరిత॥ 98

కలత బావుకొరకె కలలను సృజియించె
కలలు రాని వాడు కలడె జగతి
కలల కల్ల తెలిసి కలలనే కనుచుంద్రు
పాండురంగ వినుత భవ్య చరిత॥ 99

కష్టసుఖము లెపుడు కావడి కుండలు
ఫలము రాదు కష్టపడక ఎపుడు
ఇంతకన్న మించు ఇహలోక కథయేది?
పాండురంగ వినుత భవ్య చరిత॥ 100

నీతి బాటయన్న నిప్పులకుంపటే
ఇరుకుదారి బ్రతుకు కరకుటమ్ము
ముళ్ల విడిచి మనము పువ్వుల తేవలె
పాండురంగ వినుత భవ్య చరిత॥ 101

మనిషి పైకి - లోన మాలిన్యముండును
చలువరేని యందె నలుపు మచ్చ
నరుని కున్న విషము నాగన్న కేదిరా
పాండురంగ వినుత భవ్య చరిత॥ 102

ఎన్ని దార్ల నడిచి ఎంత జ్ఞానము పొంద
పాడు చేయు చుండు పథము చెడుగు
మంచి నీరు కలుగ మలిన స్నానమ్మేల
పాండురంగ వినుత భవ్య చరిత॥ 103

బాధలోన కలదు భాగ్యాల జలనిధి
వేదనములయందె విజయముండు
కష్టములను కూడ కనులతో పిలువరరా
పాండురంగ వినుత భవ్య చరిత॥ 104

శునక మనుచు దాని చుల్కన చేయకు
కుక్కబుద్ధి మనిషి కెక్కడుంది?
విశ్వమందు కుక్క విశ్వాస పాత్రంబు
పాండురంగ వినుత భవ్య చరిత॥ 105

ప్రజల సేవలంచు పల్కెదరేగాని
ప్రజకు హితము చేయువారు లేరు
స్వార్థరహిత సేవ సర్వేశ్వరుడు మెచ్చు
పాండురంగ వినుత భవ్య చరిత॥ 106

పేరు కొరకు నక్కతీరున నడువకు
యశము వచ్చు భవ్యజ్ఞానికెపుడు
సోక్రటీసు కేమి స్వోత్కర్షయున్నది?
పాండురంగ వినుత భవ్య చరిత॥ 107

హృదయమందు మధువు, మదిలోన ఇక్షువు
కలిమి ఆత్మ యందు కలిగినేని
అతడు పల్కు వాక్కు అమృత తుల్యమౌ
పాండురంగ వినుత భవ్య చరిత॥ 108

- సమాప్తము -